# పశ్చాత్తాపము

1వ భాగము



నారాయణరావు బ్రదర్సు, శ్రీకృష్ణా బుక్ డిపో, రాజమండ్రి.

# పశ్చాత్తాపము

ఒకటవ భాగము.




ప్రకాశకులు.

శ్రీకృష్ణా బుక్ డిపో

రాజమండ్రి.

రాజన్ముద్రాశాల, రాజమండ్రి.

1930.

వెల రు 0-6-0

# పీఠిక.

దీనికి మొదటలో ప్రాయశ్చిత్తమని పేరు పెట్టదలచితిమి గాని యిప్పుడు పశ్చాత్తాపమనిన బాగుండునని తోచినది. రెంటికంత యెక్కువ భేదములేదు గాని మొదటిదానికన్న రెండవది కొంచెము మార్దవముగా కనుపించుచున్నది.

సంఘములోని స్వల్పలోపములను చక్కబాటు చేయుటకు చేయవలసిన యేర్పాటులలో వ్యాసములు, ఉపన్యాసములు, ప్రదర్శనములతో పాటు యిట్టిచిన్న పుస్తకములు కూడ చాల యవసరమగుట చేత నిది మొదటిభాగముగా బయలు దేర తీసితిమి. ఇవి మంచి లెక్కలలోనికి వచ్చినచో దీనితరువాత భాగములుకూడ బయలువడగలవు. ఇది యింతచిన్నదిగా తయారుచేయుటకు కారణము మా (బంగారుయోగము) లోని పీఠిక చూచిన తేలగలదు. దీని తరువాత నిట్టివియె కొన్ని "ఫార్సుల" పుస్తకములు కూడ బయలుదేర దీయుచున్నాము. దేనికైనను పాఠకుల ప్రోత్సాహ మవసరమని విన్నవించు—

మీ పరిచితుడు,

నారాయణరావు జీ.

# పశ్చాత్తాపము



౧

కంకర రోడ్డు. ఉదయము సుమారు యెనిమిది గంటలు కావచ్చినది. "మోటారు బస్సు" నర నర వీలుగలిగినంత త్వరితముగా నడచుచున్నది. ప్రయాణీకులతో కిట కిట లాడుచున్నది. ముందువైపు డ్రైవరు ప్రక్కనుకూడ నిద్దరు ముగ్గురు బాటసారులు కూర్చున్నారు. కండక్టరు వీలుగానున్న స్థలము లేక బొటా బొటీగా తలుపుపైన కూర్చున్నాడు. త్రోవలో నొకయూరు సమీపించినది. త్రోవప్రక్క నొక చిన్నది—సుమారు పదునారు సంవత్సరములవయస్సు, పచ్చని మేని ఛాయ వదులుగానున్న వాలుజడ, చుట్టుచంగావి పార్షీయంచు చీర చుట్టు త్రిప్పికట్టు, పలుచని జాకట్టు చెవులకు దుద్దులు, మెడలో బంగారు గొలుసు, కాళ్ళకు పట్టీలు, మూడుజతలు గాజులు-చేయియెత్తి బండాపుమని సంజ్ఞచేసినది. బండి యాగినది. బండిలో నెంతమాత్రము స్థలము లేదనియును, ఉండవలసిన వారికన్న నిదివరకే యెక్కువ యున్నారనియును, ఊపిరి విడచుటకైనను యవకాశము లేదనియును దసరా సెలవు లాఖరగుట వలన స్కూలు తెరవబడు రోజు గనుక నంత క్రిక్కిరిసియున్నారనియునుకండక్టరుచాలవిచారము

ను సూచించుచు తెలియపరచెను. బండిలో సుమారు పదునె నిమిది సంవత్సరములు మొదలు ఇరువది సంవత్సరముల వరకు వయస్సుగల యువకులు--విద్యార్థులు--ఆ యా పల్లెటి గ్రామములనుండి పట్టణమునకు బోవుచున్నవారు చాలమందిగలరు. స్కూలు తెరవబడురోజు. లోపలస్థలము వంద్రెండుగురకుమాత్రమే నిర్ణయింపబడినది. అప్పటికి పదు నేడుగురు కూర్చున్నారు. వారంద రొకక్కసారిగా దూసుకొని పోయేటట్లు చూచేరు చిన్నదానిని.

ఒకడు—"ఇదేవ్వూరో"—అన్నాడు తెలియనటుల.

రెండ—ఏవ్వూరై తేనేం స్థలమియ్యాలి గాని.

మూడ—అవును. ముందువాళ్ళమాట చూడాలి పాపము—అన్నాడు ప్రేమ యుటిపడునటుల.

మరియొకడు—మన దేశమైంది గాని దొరలై తేనా!

మరియొకడు—ఎవరో సంసార్లు కాబోల్ను రా!

ఒకడు పక్కవానితో రహస్యముగా—"ఎవరై తేనేం మంచి షోకుగా వుంది."

ఒకడు—సంసారిలా కనపడదురా. మంచి కాలక్షేపణ. త్రోవలో.

ఈ విధముగా వారిలో వారు మాటలాడు కొనుచుండిరి. "చాలా అందము" "మంచిషోకు" "తప్పకుండా" "ఏమైనా సరే" మొదలయిన ధ్వనులు పుంఖాను పుంఖములుగా బయలు దేరినవి. చిన్నది కండక్టరువైపు జూచి "ఒక్కరికి స్థల

ము లేదా. ఒక్కమనిషికి మాత్రం" అన్నది. పాపము కండక్టరు జాలిపడి "లోపల, వెలుపల నిండిపోయింది. నేనేమిచేయుటకును వీలులేదు. లోపలివారి యిష్టం. వారొప్పుకుంటే సరి. మీరు కూర్చోవచ్చు. నా కేమీ అభ్యంతరంలేదు." అని యొక చచ్చుసమాధానము చెప్పెను. "స్థలమా! ఓ, కావలసినంత" అని లోపలివారందరొక్కసారిగా నన్నారు. చిన్నది వయ్యారముగా బండి సమీపించినది. దగ్గరనున్నవారు వంగి, తలుపు తెరచి యెవరిమట్టుకు వా రాత్రబడ్డారు. ఎందుకొరకు.? "ఇక్క డిక్కడ" నని యందరు తమ తమ దగ్గర స్థలములు జూపినారు. కావలసినంత స్థలము. ఎలాగున వచ్చినది? ఎక్కడ నుండి వచ్చినది? ఆ రమణియు నొక్క చిన్న నవ్వు నవ్వినది. మొగములు వికసించినవి. తల వాల్చుకొనినది. తెరచియున్న తలుపుపై నొక చేయివేసినది. ఎక్కుడు చెక్కపై నొక కాలు వేసినది. వెనుకకు తిరిగి చూచి, కొంచెము దూరముగానున్న యొక ముసలిదానిని—సుమారు 50 సంవత్సరముల వయస్సు గలది—70 సం॥ దానివలె గనబడుచున్నది.-మాసిన నీలిచింకి పావడ గూడకట్టు కట్టినది—రమ్మనుమని తలయూపి సంజ్ఞ చేసినది. ముసలిదియు యెడమచేత—చిలకకొట్టు—ఆరిపోయిన-సగముపైగా కర్చుపడిన, చుట్టపీకతోను, కుడిచేత నూతగరిత్తోను కుంటుకొనుచు దగ్గరకు జేరినది. సాగనంపుటకై వచ్చిన

దనినీ, త్రోవలో జాగ్రత్తయని చెప్పి వెనుకకు పోవుననినీ, అందరనుకొనిరి. కాని యటుల జరుగలేదు. చిన్నది ముసలి దానిని యెడమచేయి బట్టుకొని కర్ర యాధారముగా బండిపై కెక్కించినది. ముసలిదాని వెనుక తలుపు వేసినది. "వారందరు చాలా పెద్దమనుష్యులు. జాగ్రత్త" అని చెప్పి, తాను వెనుక మిగిలినది. ముసలిది వంగి లోపల ప్రవేశించి ‟అగ్గిపుల్లుందా బాబూ!" అని సాగదీసికొనుచూ ప్రశ్నించినది. పడుచువాండ్రు తెల్లబోయిరి. ముఖవికాసములు తగ్గినవి. మాడురంగు పట్టినవి. ఒకరికిని నోట మాట రాలేదు. ‟అబ్బా యింత యిరుకేమిటి?" అను గొణుగు లారంభమైనవి. ఈసంగతంతయు గనిపెట్టి చూచుచున్న యాతుంటరి మాత్రము ‟కొంచెం బొగ్గులుంటే బాగుండును" అన్నది. ‟అంతా సరుదుకున్నారా. బండి పోనీవచ్చునా?" అన్నాడు డ్రైవరు. జవాబు వినిపించదు. ‟ఎవరు మీరు" అని కండక్టరామెను సందేహించుచూ ప్రశ్నించెను. ‟మేమా? మేమాండి? మేము భోగాలము" అని యా టక్కులమారి యొక్క నవ్వు నవ్వినది. పాపమా పోటు డొక్కలలో తగిలినది. కుర్రవాళ్లకు పట్టరాని కోపము వచ్చినది. బండి కదిలినది. అప్పుడయినను పశ్చాత్తాపము రాదా?

౨

ఒకనాటి మధ్యాహ్నము సుమారు 12 గంటలు కావచ్చినది. కచ్చేరీలకు సెలవుదినము గాదు. అరుగుమీద నలుగు రయిదగురు కూర్చుని, తలలు వాల్చుకొని ప్రక్కనున్న వారు చెప్పునది తొందరగా వ్రాయుచుండిరి. కచేరీలలో కాగితములు దాఖలు చేయబడుటకు నియమింపబడిన వేళ సమీపించినది. వ్రాతగాండ్రు వినుగుగొనుచుండిరి. చెప్పుచున్నవారు తొందరగా చెప్పుచుండిరి, ఎవరో చిన్నవాడు—సుమారు 20 సంవత్సరములు వయస్సువాడా త్రోవను వచ్చి యక్కడ నిలచి యీ తమాషా యేమని చూచుచుండెను. కూర్చుని వ్రాయు లేఖరులలో నొకడు, వానివైపు చూచి తలపైకెత్తి కండ్లెర్రజేసి "ఏం చూస్తావు గాడిద గుడ్డు" అని గసరెను. చిన్నవాడు సమాధానము చెప్పలేదు. సంగతి బోధపడక గాబోలు నొక చిరునవ్వు నవ్వి యావలకు వెడలిపోయెను. అవతల యెవరినో గలసికొని సంగతి వాకబుజేసి, వారందరు లేఖరులని తెలిసికొని, వెనుకకు తిరిగివచ్చి "అయ్యా! నాకొక ఉత్తరము వ్రాసిపెట్టెదరా?" అని యడిగెను.

"ఓ! అభ్యంతరమేం?"

"ఏం పుచ్చుకుంటారు వ్రాసినందుకు?"

ఒకడు అర్థరూపాయి యనెను. రెండవవాడు రెండణాలనెను. మరియొకడు పావలా యనెను. వారిలో వారు పోటీపడి బేరము చవుకలోనికి దింపినప్పటికిని చిన్నవాడు అర్థరూపాయి చెప్పిన మొదటివాని దగ్గరకే పోయి కూర్చుండెను.

అందరును వానివైపు జూచి పావలాకు వ్రాసెదననిన వానిని వదలి యర్ధరూపాయి పుచ్చుకొనువాని దగ్గరకు వెళ్లెదమని తమలో తాము వితర్కించుకొనసాగిరి. కుర్రవాడు ప్రపంచానుభవము చాలని పిచ్చిముండావాడని విచారించిరి. చిన్నవాడు లేఖరికి, దగ్గరగా గొంతుకూర్చుండి "అయ్యా! వ్రాత మొదలెడతారా?" అని యడిగెను.

లే—ఆ!

కు—ముకాం, తారీఖు వేయించేరా?

లే—ఉత్తర మేమాత్రం వుంటుంది?

కు—చిత్త మాట్టే వుండదండి.

లే—చాలా పెద్దదుంటుందా?

కు—ఊహూ. ఉ.

అని కుర్రవాడు తలడ్డముగా నూపెను.

లే—అంటే యేమాత్రం. సుమారు?

కు—సు మా రూ— ఊ— ఉ—

లే—సరే. సాగదీసుకొనేటప్పటి కయింది త్వరగా తెల్పు.

కు—సరే. వ్రాయించండి. మ రా రా శ్రీ. గంగా భాగీరథీ సమానులైన మా నాన్నగారికి—వ్రాసేరా?

లే—ఆ, తరువాత.

కు—ఇక్కడంతా క్షేమం అక్కడ—వ్రాసేరా?

లే—ఆ. వ్రాసేను. తరువాత

కు—క్షేమం వ్రాయించ కోరుతాను—వ్రాసేరా?

లే—ఆ. తరువాత.

కు—ఈ మధ్య నే నిక్కడ సంతకువెళ్ళి—వ్రాసేరా?

లే—ఆ. తరువాత.

కు—అక్కడ మంచి గుర్రంకోసం సంతంతయు వెతికేను—వ్రాసేరా?

లే—ఆ. వ్రాసేను. త్వరగా తేల్చాలి.

కు—అయ్యో! తొందరపడితే యేలాగ?

లే—తొందరేమిటి! పల్లెటూరి వెర్రిమొకంలాగ ఆలోచిస్తూ కూర్చుంటే ఎంతసేపు?

కు—చిరునవ్వు నవ్వుకొనుచు—చిత్తం. సంతంతా వెతికేను. తిరిగి, తిరిగి, తిరిగి, తిరిగి, వెతకి, వెతకి, వెతకి, వెతకి. వ్రాస్తున్నారా—ఒకగుర్రాన్ని—వ్రాసేరా?

లే—ఆ. వ్రాసి చాలాసేపయింది. నీ వనవసరం ప్రశ్నలు వేసి నా పని పాడుచేయక, త్వరగా త్వరగా తేల్చాలి.

కు—మీరు మహా తెలివైనవారండి. ఇంతచురుకుగా వ్రాసేవార్ని, నే నెక్కడా చూడలేదు.

లే—సరేలెండి. త్వరగా తెమల్చండి లేకపోతే యివిక్కడ పారవేసి అవతలకు పోతాను.

కు— చిత్తం. తమదయ. అక్కడ నొక పెంకిసన్యాసి గుర్రాన్ని సంపాదించాను—వ్రాసేరా

లే— వ్రాసేనయ్యా! నీవు ప్రశ్నలువేసి నన్ను చంపక త్వరగా త్వరగా కానీ.

కు—అయ్యో! తమరు మహాచురుకుగా వ్రాస్తున్నారు.

రంగం వుత్తరాల లాగ అక్కడ చదవడానికి కూడ మీారే వె
ళ్ళవలసిన యదృష్టము పట్టదుకదా ఖర్మం?

లే—ఏం? అంత చేతగాని ముండాకొడుకు ననుకున్నా
వా? తరవాత చెప్పు.

కు— చిత్తం అయితే సరే. అంత నా గుర్రింమీాదె
క్కి నడవమన్నాను. అది కదిలిందికాదు — వ్రాసేరా.

లే— ఊ. తరువాత.

కు— అది నడచినది కాదని నాకు కోపమువచ్చి—
ఆపట్నా -చేతిలోని జవ్వ పుచ్చుకొని అదేపనిగా దెబ్బమీాద
దెబ్బ, దెబ్బమీాద దెబ్బ, దెబ్బమీాద దెబ్బ, దెబ్బమీాద
దెబ్బ, దెబ్బమీాద దెబ్బ—

అని వ్రాసినకొలది చెప్పుచు సుమారు కొన్నివందలు
చెప్పి వ్రాస్తున్నారా? అని తాజాగా ప్రశ్నించెను.

లే—ఆ! వ్రాస్తున్నాను. అప్పుడే ఆదెబ్బమీాదదెబ్బలు
సుమారు రెండరటావులైనాయి. ఇంకవి చాలించి తరువాత
చెప్పండి.

కు— చిత్తం. ఆ గుర్నాని కాపట్నా కోపమువచ్చి,
యెగిరి తన్నుమీాదతన్ను, తన్నుమీాదతన్ను, తన్నుమీాదత
న్ను, తన్నుమీాదతన్ను, తన్నుమీాదతన్ను, తన్నుమీాదత
న్ను—అని యది వరకు దెబ్బమీాదదెబ్బల వలెనే కొన్ని వంద
లు చెప్పడ మారంభించెను.

లే— సరే. ఇప్పటికివి రెండు పేజీలు పైగా పట్టేయి.
ఇక నివి చాలించి తరువాత కథచెప్పు. ఏమిటీసోది?

కు—చిత్తం సోదిలాగేవుంది. సోదయినా తప్పదు, అర్ధ రూపాయి పూరికే దాఖలుచేసుకుంటారా?

లే—ఎలాగయితే యిచ్చేవులే. గంట దగ్గరా అయింది. అవతల లాలస్యమవుతుంది. త్వరగా చెప్పు చంపక.

కు—చిత్తం. ఇక నా గుర్రమును కొట్టినను, చంపినను లాభము లేదని భుజము పైకొంచెము తట్టి ఈలాగన్నాను— అని గుర్రమును నడిపించునప్పుడు చేయు ధ్వనివంటి ధ్వని యొకటి తమాషాగా నోటితో నను చు వ్రాస్తున్నారా? అని యడిగెను.

అంతవరకు వ్రాసిన లేఖరి యీ ధ్వని నెటుల వ్రాయవలయునో తెలియక కంగారుపడి "ఇదేలాగ వ్రాయటం" అని కంఠ్గర్జజేసెను.

కు—అయ్యో! ఆలా వెర్రిమొగము వేసికొని చూస్తారే మయ్యా! త్వరగా వ్రాయండి దయచేసి. ఇంకా వ్రాయవలసినది చాలావున్నది.

లే— అది వ్రాయటం యేలాగా? నా మొకంలాగ— అని కోపముగా కలము క్రింద పారవేసెను.

కు—అయ్యో! పూర్తిగా వ్రాయకపోతే అర్ధరూపాయి యేలా వస్తుంది. త్వరగా త్వరగా వ్రాయండి దయయుంచి. అవతల నాకు చాలా పని వున్నది—అని కుర్రవాడు సాక్షేపముగా పలికెను.

లే—నే నింక వ్రాయను.

కు—అయితే నేను డబ్బివ్వను.

లే—ఏలాగివ్వవో చూస్తాను.

కు—ఎందుకు వ్రాయవో చూస్తాను డబ్బు కావలసిన వాడవు—అని చిరునవ్వు నవ్వెను. లేఖరికి కోపము వచ్చినది. చిన్నవాని కొరకు వ్రాసిన కాగితములు—సుమారు, అయిదారు పోగుచేసి చేతబట్టుకొని "నీవు చెప్పిన ఈచిత్తం తా ఏం చేయమంటావు?" అని కండ్లెఱ్ఱజేసి గద్దించెను.

కు—తమచిత్తం. ఇందాకటి గాడిదగ్రుడ్డుక్రింద జమ కట్టించండి. చాలా కష్టపడ్డారు పాపము. ఇకనాకు సెలవిప్పించండి దయచేసి. పట్నవాసపు వెర్రిమొగము గారు. ఇంకోసారి తీరుబడిగా దర్శనం చేస్తాను." అని యా కుఱ్ఱవాడు చిరునవ్వు నవ్వుచు యాలేఖరిని ఓరకంట చూచుచు దర్జాగా వాని త్రోవను బోవుచుండెను. లేఖరునకు కడుపుమండినది. సుమా రొక యరణా కాగితములు కర్చయినవి. ఒకగంట కాలము పైగా వ్యర్థమైనది—ఆయాసముగాక. ఆ కుఱ్ఱవానిని కాళ్లు పైకి తల క్రిందకు వ్రేల్లాడ దీయవలయు నన్నంత కోపము వచ్చినది. కానియేమి చేయగలడు. కండ్లెఱ్ఱజేసి రెప్ప వాల్చక, నిర్విచారముగా పోవుచుండిన కుఱ్ఱవాని వైపు చూచు చుండెను. దగ్గరనున్న వారందరు లేఖరి వైపుజూచి నవ్వుచు "ఇందుకొరకే పావలాకు వ్రాయువానిని విడచి నీదగ్గరకు వచ్చినది. మంచిపాఠము. నీ కంత తొందర పనికిరాదు. మన మితరుల నెట్లు చూచెదమో యితరులు మనల నట్లె చూచెదరు. అన్నావు గనుక పడినను పరిహాసము లేదు. పశ్చాత్తాపము కలిగి ప్రవర్తించు" అని మందలించినారు.

## 3

అసలే చిన్న గ్రామము. అందొక్కటే సత్రము. బస చేయుట కంతకన్న నాయూర నితర యాధారమేదియు లేదు. ఆ సత్రి మానాడు చాలామంది బాటసారులతో కిటకిట లాడుచున్నది. సాయంకాలము సుమారు యేడుగంట లు కావచ్చినది. అదివరకు వర్షము వచ్చియుండుట చేతను, అ ప్పటి కింకను చిన్న తుంపర పడుచుండుటచేతను, దట్టమైన మ బ్బువలన వీధిలో గాఢమైన చీకటి గ్రమ్మియుండుటచేతను, సత్రములో మకాము యేర్పరచుకొనినవారు లిబ్బందిపడుట కిష్టములేక గడపదాటి వెలుపలకు బోవక లోపలనే యిరుకు కొని యుండవలసిన వారవుటచేతను, సత్రము మరింత గందర గోళముగా నున్నది. సత్రము గుమ్మములోని లాంతరు పేరు నకు మాత్రము పెట్టబడి, వెలిగించబడిన యసలైన సత్రము లాంతరు గనుక, దానిలో దీపము వెలుగుచున్నదో లేదో నిర్ధా రణ కావలయుననిన నొక యగ్గిపుల్ల వెలిగించి చూడవలసినదే గాని మాటలతో తేలదు. అట్టి సమయమున నా కారుచీకటిలో పై నుండిపడు వర్ష పుతుంపరకు తడియుచునొక చిన్నవాడు సుమా రు యిరువదిమూడు సంవత్సరముల ప్రాయమువాడు 'బైసికిల్' చేత నడిపించుకొనుచు సత్రము వీధిగుమ్మము దగ్గరకు వచ్చి గంట వాయించెను. గంట చప్పుడు వినిపించి నంతనే పక్క ను వీధియరుగుపైన చీకటిలో గోడకు జేరబడి కునికిపాట్లు ప

డుచుండిన ముసలి నౌకరొకడు త్రుళ్ళిపడి లేచి బండిదగ్గరకు వచ్చి "అయ్యా! సత్రింలో యీవేళ స్తలం దొరకదండి" అని వినయపూర్వకముగా చెప్పెను. అంత నా యువకుడు వానికి సమాధానముగా 'బండి జాగ్రత్తపెట్టు. చీకటితోనే వెళ్ళిపోవాలి. నీ మాట మరచిపోనులే. నిన్ను సంతోషపెడతాను. అది చెప్పాలా వెర్రివాడా!' అని సరసర లోపలకు బోవుచుండెను. నవుకరు మాత్రము "అదికాదండి. లోప లెవరికి స్తలం దొరకదని చెప్పమని గుమస్తాగారు శెలవిచ్చేరు" అని కొంచెము గట్టిగా చెప్పెను. అప్పటి కప్పుడే చీడీలపైకి పోయిన చిన్నవాడు వెనుకకు తిరిగి "అవునాలాగే. మట్టి చాలాఅంటుకుంది. శుభ్రంగా కడిగి తుడిచి వేస్తే మంచిదే. అలాగేచెయ్యి. నీకేమయినా యిస్తా నన్నానుగాను. నీవుచాలా మంచివాడవు లాగున్నావు" అని పలుకుచు త్వర త్వరగా లోపలకు బోయెను. "ఆయనకు చెవుడు గాబోలును, గుమస్తాగారే చెప్పుకుంటారు. నా కెందుకీ సోది" అని గొణుగుకొనుచు నవుకరు బండిమాత్రము చావడిలో జాగ్రత్తపరచెను. చిన్నవాడు హడావడిగా లోపల ప్రవేశించుటచే నక్కడివారందరు వచ్చినవా రెవరోయని కొంచెము సరుదుకొనిరి. అక్కడక్కడ కొంచెము కాళీగా గనుపించుచున్నది. కాని వాని రాక కనిపెట్టిన గుమాస్తా—యజమానివలె నటించునాయన—చిన్న యజమాని—తొందరగా యెదురువచ్చి యతి వినయము నటించుచు "అయ్యా! ఈ రోజున సత్రములో కాళీ లేదు. తమవంటి సంపన్న గృహస్థు

ను సత్కరించుట కీవేళ వీలు లేకుండా వచ్చినందులకు నాకు చాలా విచారంగా వుంది. ఎవరో చాల మంది వచ్చి యుండు టచేత ఖాళీ లేకపోయినది. క్షమియించి మరియొక చోటకు..." అనుచుండగ నద్ధోక్తిలోనే చిన్నవాడు "చిత్తం చిత్తం. మీ సెలవు. అంతేకన్నా నా, ఈసత్రము కట్టించిన ధర్మాత్మునికన్న మీదే యెక్కువ సుకృతం. ఈప్రాంతములలోనున్న ఈ సత్ర ము, దీనికి తగినట్టు మీ వంటి పుణ్యమూర్తులు యిక్కడుండి బాటసారులను సత్కరిస్తూ వుండడమంటూ లేకపోయిన యెంత చిక్కుగానయినా వుండును. అలాగే తమచిత్త ప్రకార మీ రాత్రి కిక్కడనే యుండి వుదయముననే లేచి వెళతాను. తమ యాదరణ వలన నాకు చాలా సంతోషమైనది." అని చిన్న వాడు చాలా వినయపూర్వకముగా చెప్పెను. కాని సత్రము యజమాని ముఖము చిట్లించుకొని గొంతుక కొంచెము సరిజే సికొని "అదికాదయ్యా! ఈ రాత్రి కిక్కడ వుండుటకు వీల్లేదు. అన్ని గదులు నిండిపోయినవి. ఎక్కడనూ కూర్చుండుటకైనా స్థలములేదు. అంచేతనేగా యింతకుపూర్వ మిక్కడకు వచ్చిన ముసలాయనా, వానికూతురు యీ కారుచీకటిలో తడుస్తూ నైనా, మరియొకచోటకు పోవలసివచ్చినది. ఇక్కడబసచేయుట కెంతమాత్రమును వీల్లేదు. చూడండి. అన్నిగదులు నిండిపో యినవి." అని చెప్పుచు చేతులు బారచాపుకొని గదులవైపు జూపుచు బిగ్గరగా నరచి చెప్పెను. చిన్నవాడు కృతజ్ఞతను వెలి బుచ్చు చిరునవ్వు నవ్వుచు "చిత్తం చిత్తం. తమ దయుంటే అంతేచాలు. గదులలో నున్నమాటేమిటి? హాలులో చాలదా!

గదిలో" పరుండమని తమసెలవైతే అలాగే. ఇంతరాత్రివేళ నిట్టకటికచీకటిలో వచ్చిన నావంటి బాటసారికి తమవంటి ధర్మమూర్తులు గనుక గది యిచ్చి సత్కరిస్తామంటున్నారు గాని లేకపోయిన నే నెంతచిక్కుపడవలసి వచ్చును. తమరు మహానుభావులు, పుణ్యమూర్తులు, ధర్మస్వరూపులు'' అని యా చిన్నవా డతివినయముగా వంగి వంగి కృతజ్ఞతను తెలుపుచు దగ్గర ఖాళీగానున్న నొక కుర్చీలో గూరుచుండెను. సత్రపు గుమాస్తాకు మితిమీరిన కోపము వచ్చినది. ఇక నేమి జెప్పినను లాభము లేదనియును, తాను గొంతు బ్రద్దలుజేసికొని చచ్చినను వానికి వినిపించదనియును నిర్ధారణ జేసికొని "గదికూడా యిస్తాను నీకు. పాపము పరుందువుగాని వెచ్చగా చెవిటిముండకొడుకా" అని గొణుగుచు నిందించదొడగెను. ఆ పూట నా సత్రములో బసజేసిన కొందరు యువకు లక్కడ కుర్చీలలో కూర్చుని కాళ్లుచాపుకొని కులాసాగా మాటలాడుకొనుచుండిరి. ఆ కుర్చీలలో ఖాళీగానున్న నొక కుర్చీలోనే మన బాటసారి కూర్చున్నది. పనిమీద వెలుపలకు బోయిన యొక యువకుడు వచ్చి, తన కుర్చీ ఖాళీచేసి యీయవలయునని మన బాటసారిని గద్దించెను. బాటసారియు వినయపూర్వకముగా నవ్వుచు "చిత్తం. తమ దయకు నాకు చాలా సంతోషముగా నున్నది. ఈ కుర్చీచాలండి. పడకకుర్చీ అక్కరలేదు. తమకు చాలా వందనములు" అని నెమ్మదిగా సమాధానము చెప్పెను. కాని యువకునకు చాలకోపమువచ్చి "ఇక్కడనుండి లేచెదవా! రెండు జబ్బలు పట్టుకొని బలవంతముగా యీవల

కేడ్చుచున్నావా!" అని పెంకు లెగురునటుల కేకలువేయ నారంభించెను. బాటసారి మాత్రము కదలక మెదలక గంతులు వేయుచుండిన వానివైపు నిశ్చేష్టుడై చూచుచుండెను. అక్కడ నున్నవారందరేదియో పేచీ జరుగునని యెవరిమట్టుకు వారు లేచి వచ్చి మధ్యనిలచి యువకుని తొందరపడవలదని శాంత పరచజొచ్చిరి. మన బాటసారియు "అయ్యా! తమదయ. ఇంత మాత్రమునకు తమరు నామీద నింతగా ఆగ్రహపడవలయు నా. అపరిచితుడనైన, నన్నింతగా గౌరవముచేయుట తమవంటివారి యుదారత్వమును వెల్లడి పరుస్తుంది" అని యందరకు నమస్కారములు చేయుచు జరుగబోవనున్న తగాదాలో యువకునకు తోడుపడుటకై, కుడితినీచేతులు పైకి మోచేతుల వరకు నెగలాగి వాని ప్రక్కను సిద్ధముగా నుండుటకై లేచి నిలుచుండిన యువకులలో నొకని ఖాళీ పడకకుర్చీలో నతి శాంతముగా కూరుచుండెను. అందువలన యువకులందరకొక్కసారిగా కోపము వచ్చినది. సత్రములోనున్న యితర బాటసారులు మన బాటసారి చెవిటితనమునకు మిక్కిలి చింతిల్లి, తగాయిదా, దెబ్బలాట జరుగకుండ మధ్యవచ్చి వారల నాపు జేసిరి. కాని యువకులలో నొకరిద్దరకు పట్టుదలలు వదలలేదు. వానిని బలవంతముగానైనను కుర్చీలోనుండి లేవదీయ నభిలాష పడిరి. కాని బాటసారికూడ వయసులోని వాడవుటచేతను, దృఢశరీరుడై యుండుటచేతను, చేతులు కలియవలసివచ్చినచో వీరలందర కించుమించుగా సమాధానము చెప్పగల వానివలె

గనపడుచుండుటచేతను, వీరిలో పట్టుదలయే గాని, ధైర్యసా
హసములు మందునకైనను లేకపోవుటచేతను, వారిలో బుద్ధి
మంతులు కలుగజేసికొని తగువుపడువారి నాపుజేసిరి. బాట
సారి మాత్రము నిశ్చలముగా గూరుచుండి జరుగనున్న సంగ
తిలో తనకేమియు సంబంధము లేనివానివలె మీసము వడివే
యుచు వారల యుడుకుబోతు మొగముల జూచి నవ్వుచు,
“చిత్తము, తమదయ” అని మాత్రి మప్పుడప్పుడనుచు, కా
లుపై కాలువేసికొని వయ్యారముగా నూగులాడించుచు, గూ
రుచుండెను. యువకులలో గొందరకు మాత్రము మన బాట
సారి మొండితనమునకు, తమకుజరిగిన పరాభవమునకు తగిన
మందు వేయవలయునని యభిలాష గలిగినది. కొందరు తమ
లో తాము గుస గుస లాడుకొనుచు యేదియో యాలో
చించుచుండిరి. పైగానున్న యితర బాటసారులు మాత్రి
మంత చిన్నతనముననే వాని కంత యభేద్యమైన చెవుడు వచ్చి
నందునకు చాల చింతిల్లిరి. లోపలనుండి యాకథంతయు నాల
కించుచుండిన సత్రము గుమాస్తా యివతలకు వచ్చి చెవిటివా
నితో ప్రసంగించిన నెంతమాత్రము లాభములేదనియును, నా
రాత్రి వానికి తగినటుల బుద్ధి వచ్చు నేర్పాటు జేసితిననియును
వానిని తెల్లవార్లును వంటవసారాలో బరుండబెట్టిన గాని బుద్ధి
రాదనియును జెప్పి యువకులను సమాధానపరచి తాను లోప
లకు వెడలిపోయెను. మన బాటసారి యేదియో యాలోచించు
కొనుచు గూర్చుండెను. యువకులు మాత్రము వారి వారి

పరిసంగములు గానిచ్చుచుండిరి. కొంతసేపు గడచినది. సత్రపు వంటబ్రాహ్మణుడు యువకులదగ్గరకు వచ్చి వంటలయినవని చెప్పి వెడలి పోయెను. అందరును భోజనముల నిమిత్తము లోపలకు పోయిరి. చెవిటి బాటసారి గూడ వారితోపాటు లేచి, వారికన్న ముందు వంటసాలలోనికి పోయి తా నొక విస్తరిదగ్గర సరుదుకొని, కూర్చుండెను. యువకు లొకరితరు వాత నొకరు భోజనసాలకు పోయి తలయొక విస్తరిదగ్గర కూర్చుండుచు చెవిటివానిని జూచి యెవరిమట్టుకు వారు విసువు కొనజొచ్చిరి. కొందరు గట్టిగా మూలుగుచు దుర్భాషలాడ సాగిరి. చెవిటిబాటసారి మొదట లెక్కలోనివాడు కాకపో వుటచేత చివరనొక యువకునకు విస్తరి తక్కువ వచ్చినది. పాప మాతడు కండ్లెర్రజేసి కొట్టునంత యడావిడి జేసెను. కాని వాని నేమియు జేయలేనివాడు గావున వంటవానిని బిలచి మఱియొకవిస్తరి వేయించుకొని తన మర్యాద తాను గాపాడుకొనెను. మన బాటసారి సంబంధములేక వచ్చుటచే తను, వార్లలో జేరి గూర్చునియుండుటచేతను, కూర్చొనుటలో యేదేనొక మూల గాక సత్రపుయజమానివలె, ఆ విందునకు ముఖ్యపాత్రివలె, ప్రాముఖ్యమైన స్థలమున తనంత తా ముం దుగావచ్చి గూర్చుని యుండుటచేతను, అంతకు పూర్వము వారలందరితోను ఘర్షణ పడియుండినవా డవుటచేతను, యువ కులందరకు చాల యుడుకుబోతుతనము గలిగి, వారి వారి కడు పుమంటలు తీర్చుకొనుటకై తలయొకమాట నాడజొచ్చిరి.

కాని సత్రపుగుమాస్తా మాత్రము కొంచెము ప్రపంచజ్ఞానము గలవాడవుటచే, వార్లను తొందర పడవలదనియును, వానికి దగిన యేర్పాటు వేరుగా తాను జేసియుంచితిననియును, దాని తోగాని వానికి ప్రాయశ్చిత్తము జరుగదనియును చెప్పి వారిని శాంతపరచెను. భోజనములైనవి. అందరును విస్తర్లదగ్గర నుండి లేచి, యెవరంత వారు తొందర తొందరగా వచ్చి, చాటసారికి కుర్చీలేకుండ జేయు తలంపున తలకొక కుర్చీ యాక్రమించుకొనిరి. భోజనానంతరము విశ్రాంతికై, చాటసారి కుర్చీ కొరకు వచ్చుననియును, అతడు కాళీ కుర్చీ దొరకక రిచ్చవడు ననియును, అందువలన వానికి దగిన పరాభవము జరుగునని యును, అంతట నందరు వానిని పూర్తిగా గేలిసేసి తమ దుఃఖము కొంత తీర్చుకొనవచ్చు ననియును, వారు చాల యాసక్తిగా కనిపెట్టుకొని యుండిరి. కాని వా రభిలాషపడినటుల చాటసారి కుర్చీలదగ్గర కనుపించలేదు. వారుమాత్రము తలకొకసిగరెట్టు, చుట్ట యెవరికి కావలసినది వారు వెలిగించుకొని, చాలా కులాసాగా ముచ్చటలాడుకొనుచు జరుగబోవనున్న మహాదానందమును తలచుకొని ముసి ముసి నవ్వులు నవ్వుకొనుచు గుస గుస లాడుకొనుచుండిరి. చాటసారి యిది యంతయు కనిపెట్టి చూచియుండుటచే గాబోలు నక్కడకు రానయిన లేదు. మీసము వడివేసికొనుచు కొంచెము దూరమున నటునటు పచారుచేసి త్వరలో నక్కడనుండి వెడలిపోయెను. యువకులలో నన్యోన్య సరస సంభాషణలు జరుగుచున్నవి. చెవిటి

వానికి తగిన పరాభవము జరుగుననియును, అందరు చూచి యానందించవచ్చుననియును యుబలాటపడుచుండిరి. కాని బాట సారి యచ్చట కనుపించక పోవుటచేత నేమయ్యెనో యని వారిలో వారాలోచించుకొని సత్రపు నవుకరును బిలచి చూచిరమ్మని బంపిరి. నవుకరు కొంతసేపటికి తిరిగివచ్చి చెవిటి వాడు యువకులనిమిత్త మేర్పాటు చేయబడిన గుమాస్తాగది, లోపల గడియవేసికొని యుండెనని చెప్పెను. యువకులంద రొక్కసారిగా లేచి కేకలు వేయుచు పట్టరాని కోపమున గది దగ్గరకు వెళ్ళి, బాటసారిని పిలువ నారంభించిరి. ఎంతకును సమాధానము వినరానందున వారందరు తలుపు బ్రద్దలు గొట్టవ మనియును, చెవిటివాని తల చెక్కలుజేసెదమని యును ప్రతిజ్ఞలు బట్ట నారంభించిరి. సత్రపుగుమాస్తా మాత్ర ము వారందరకన్న తన కెక్కువ కోపము వచ్చినను తనలో తాను సరుదుకొని సత్రపుతలుపులు మాత్రము బ్రిద్దలుగొట్ట వలదని మొఱబెట్టజొచ్చెను. "పోతేపోవును మాకేమి విచా రము. ఈ రాత్రి యీ చలిలో మమ్మెక్కడ పరుండమనియె దవయ్యా" అని కేకలిడ జొచ్చిరి. సత్రపు గుమాస్తా గదిదగ్గ రకు వెళ్లి తలుపు రంధ్రము ద్వారా లోపలనున్న దీపము వెలుతురు సహాయమున మంచముపైని కూర్చునియున్న మన బాటసారిని చూచెను. బాటసారియు నేదో తనలో దాను మాటలాడు కొనుచుండుటజూచి తలుపురంధ్రముదగ్గర చెవిబెట్టి లోనిమాటలువినజొచ్చెను. "ఈ ప్రాంతములలో దొంగలభయం,

ఎక్కువని తెలిసి, తగినంతజాగ్రత్తమీద రావటమే మంచిదయింది. ఈరాత్రి నిద్రాభంగమైనా సరేకాని తెల్లవార్లు మేలుకుని ఈ చేతితుపాకి సిద్ధముగా పట్టుకుని కూర్చుంటాను. అంతరాత్మయన నెట్టిదో విశదమైన నెరుంగని యిట్టి గుమాస్తావున్న సత్రంలో నెంతమాత్రము, అజాగ్రత్తగా వుండగూడదు. ఎవరువచ్చినా సరే తల ముక్కలు ముక్కలై, మెదడు వూడి క్రిందపడేలాగ ఈపిస్తోలుతో కాల్చివేస్తాను. ఆరుతూటాలకు, అధమము ఆరుగురు కట్టుపడిన తరువాత కదా, నావరకు వచ్చుట. ఆ పైన చూచుకోవచ్చు. సత్రపుయజమాని గానీ, వాడి తాతగానీ, దేవుడయినా సరే ఈరాత్రి మాత్రం యెవ్వరిని లోపలకు రానీయకూడదు. ఇంత సొమ్ము దగ్గర బెట్టుకుని మొగమోటబడితే ఎంతమాత్రం లాభంలేదు." ఈమాటలు వినుపించు నప్పటికి గుమాస్తాకు గుండెలు దిగజారినవి. నాడి పిక్కలలో గొట్టుకొనునట్లయ్యెను. అదివరకన్ని కబురులు చెప్పి, యెట్టులయిన నా చెవిటివానికి తగిన పరాభవము చేసి, బుద్ధి చెప్పి, తన యొక్కయు తనస్నేహితుల యొక్కయు కసిదీర్చుకొనవలయునని చేసిన ప్రతిజ్ఞలు, చెప్పిన ప్రగల్భములు యేమైనవో తెలియదు. కొంతసేపటికి స్థిమితపడి వెనుకకు తిరిగి తన స్నేహితులదగ్గరకు పరుగెత్తెను. వారును చెవిటివాని పరాభవమును, ఆ పైన తమకు గలుగనున్న యానందమును గూర్చి ముచ్చటించుకొనుచుండిరి. గుమాస్తాదగ్గరకు వచ్చిన వెంటనే యందరు వానికెదురేగి, వాని ముఖముచూచి తెల్లబో

యి వెనకకు తగ్గిరి. గుమాస్తా కంగారుగా లోపలబడి వగర్చు చు, నగము నగము ధ్వనులతో చెవిటివాని మాటలు వారికి తెలియజెప్పెను. వారును కొంచెము కంగారుపడి నసుగుకొని "ఏమైనాసరే వానిని బయట కీడ్చిపారవేయాలిగాని ఈరాత్రి చచ్చినా వానిని లోపల పరుండనియ్యగూడదు. ఈ బయట చలిలోమాత్రం మేము పరుండేది లేదు. చచ్చు చవట ఒకడు లోపల పరుండడం ఒకడికోసం మేమంతా బాధపడ టం చేతగాని వాళ్లలాగ, వీడి కేమైనా అచ్చువ్నామా? ఆ- వీడి తాతల్లాంటివాళ్ళను చూచేం" అని కేకలిడజొచ్చిరి. గుమా స్తామాత్రం లోపలనున్న బాటసారి మాటలు తనచెవులతో తాను స్వయముగా విన్నవాడుగావున ధైర్యముచాలక పిస్తోలు మాట జ్ఞప్తికివచ్చినపుడెల్ల గుండెలు ధడీలుమన మిగిలినవా రిని శాంతపరచుటకై చాల ప్రయత్నము చేసెను. కాని వడు చువాళ్ళు మాత్రము ముందు చూపుగాని వెనుక చూపు లేనివారగుటచే వాని మాటలు లక్ష్యముచేయక బాటసారి పరుండియున్న గది వైపునకు పరుగులెత్తిరి. కాని యక్కడకు బోవునప్పటికి వారిస్థితిగతులు వారికి జ్ఞప్తికివచ్చినవి. తమరు నిరాయుధులై యుండుటయు, లోపల తమ ప్రతికక్షి చేతిలో, సిద్ధముగానున్న పిస్తోలుండుటయు వారి కొక్కసారిగా స్ఫురిం చినందున వారు ధైర్యముజాలక గుమ్మముున కిరుప్రక్కల నిలు వబడి, వారలొండొరులకు తగిలిన యతిస్వల్పమైన చప్పుడు వినబడినంతగానే యది పిస్తోలు పేలిన ధ్వనియని యదరిపడు చు

తలుపు కన్నములోనుండి తొంగి చూచుటకై నను సాహసిం చక "నీవు చూడు, నీవు చూడు" అని వంతులు వేసికొనుచు నొకరి నొకరు గెంటులాడుకొనుచుండిరి. కాని యెక్కరును సాహసించలేదు. కొంతసేపటి కొక కుర్రవాడు తెగించి వీలు గలిగినంత జాగ్రత్తగా లోపలకు తొంగిచూచెను. బాటసారి నగము పరుండి నిద్రరాకుండుటకై సిగరెట్టు కాల్చుచుండెను. అట్లు కాల్చుచు మధ్య నొకపక్కనుండి మరియొకప్రక్క పరుండుటకై సరుదుకొనెను. తొంగి, తొంగి, చూచుచుండిన కుర్రవాడు. ఆ మార్పు చూచి బాటసారి పిస్తోలు పేల్చుట కొరకు ప్రయత్నించుచున్నాడని కంగారుపడి ప్రక్కనున్న వారిపై పడెను. వారును సంగతి దెలియక, యేదో యుపద్ర వము వచ్చుచున్నదనియును, అందుచేతనే మొదటివాడు తప్పిం చుకొనుటకై పారిపోవుచున్నవాడనియును భ్రమపడి, యంద రును, తమ తమ ప్రాణరక్షణార్థమై పారిపోవప్రయత్నించి, యొకరిపైన నొకరు పడి, దొర్లిపడ నారంభించిరి. వెనుక దూరమునుండి సంగతికనిపెట్టుచు చూచుచున్న గుమాస్తావారల యవస్థజూచి నవ్వుచు, వారిని తనవెంట దీసికొనిపోయెను. వారలందరు పరుండుట కేవిధమైన యాధారములు లేవు. రెండు గదులలోను, కుటుంబములతోనున్న వేరు బాటసారు లుండిరి. మిగిలిన పెద్దగది గుమాస్తాగారిది. అదియె చాల విశాలముగాను, అనుకూలముగాను యుండుటవలన, అదియె యువకులకొరకే ర్పాటు జేయబడినది. అందరకొరకందు

పక్కలు వగయిరా వేయబడినవి. అదిగాక నక్కడ వేరు యితర యాధార మేదియు లేదు. గుమాస్తా మాత్రము చేయు నది లేక వారలందరకు వసారాలలో పడకల కేర్పాటు జేసెను. వారి బిచానాలు శాలువల సహితముగా నాగదిలోనే యుండిపోవుటవలన పరుండుటకు గాని, పైన కప్పుకొనుటకు గాని యేమియు నాధారములు లేవు. ఎంత యభిమాన పడినను గుమాస్తామాత్ర మేమిచేయగలడు. వారలందరను యథాశక్తి నాదరించి, చాపలు పరచి యా తడివసారాలలో పరుండబెట్టెను. వారును, చలిలో బాధపడుచు చెవిటి బాటసారిని గట్టిగ దూషించిన పిస్తోలువచ్చి మీద పడునను భయమున లోలోన దూషించుచు, తెల్లవార్లు హరినామస్మరణ చేయుచు తమ ప్రతికక్షికి జరుగవలసిన పరాభవము తమకు జరిగినందున కానందమునకు మారు దుఃఖపడుచు పరుండిరి.

తెల్లవారినది. బాటసారి యందరకన్న పెందలకడ లేచి, కాలకృత్యముల దీర్చుకొని వెడలిపోవుటకై సిద్ధముగానుండి, గుమాస్తాతో కొంత ముచ్చటించి పోవలయునని వాని కొరకు కనిపెట్టుకొని యుండెను. యువకు లెవరంతవారు లేచి బాటసారిని కండ్లెఱ్ఱజేసి చూచుచుండిరి. కాని, పిస్తోలు భయము మాత్రము వారివెంట నుండకపోవలేదు. గుమాస్తా యుఱుకు లుఱుకుచు వచ్చి "చాలుచాలు లేవయ్యా! పెద్దమనిషివి—నేర్చుకొనిపోయేవు. మంచిచెడ్డ అక్కరలేదు—" అని యే మేమో యనబోవుచుండ, యువకుడొకడు మధ్యవచ్చి "చెవిటివానితో

నేమి మనకు...." అని యేదియో యనబోవునంతలో బాట సారి చిరునవ్వు నవ్వుచు "అయ్యా! గుమాస్తాగారిని సెలవియ్య నివ్వండి తమరెద్దు రాకండి" యనెను. యువకులును, అక్కడ చేరిన తదితర సత్రపు వాసులును, చెవిటివాని చెవు డేమయిన దని, యొక్కరాత్రిలోనే యంత మార్పేల కలిగినదని యాశ్చర్యముగా చూచుచుండిరి. బాటసారి "అయ్యా! మీ రంత నిర్ఘాంతపడి చూడనక్కరలేదు. మీరంద రనుకొన్నట్లు నాకు చెవుడులేదు. అది మిమ్ములను మోసపుచ్చుటకై చేసిన మాయ; తప్పు దిద్దుబాటు చేయుటకై పన్నిన పన్నిక, బుద్ధిలేనిని మందలించుటకై యాడిన నాటకము. తెలిసినదా? నా చెవుడు అభినయము. నా పిస్తోలు అబద్ధము. నా దగ్గర డబ్బు హుళక్కి. నిన్న సాయంత్రం యీ సత్రమునకు సుమారు రెండు ఫర్లాంగుల దూరమున ఒక ముసలా యనను ఆయన కూతురను చూచేను. వారు చీకటి పడుతుందని, కన్ను మిన్ను కనుపించని ఆ కటిక చీకట్లో పైనుండి పడే వర్షంలో చంటిపిల్లవాడ్ని తీసికొని యెక్కడికి పోవాలని దుఃఖంగా చెప్పుకుంటూ పోతున్నారు. నే నాగి వార్నడిగేను సంగతేమని. వారు సంగతంతా చెప్పేరు పాపము. సత్రపుగుమాస్తాగారి అన్యాయానికి, బాటసార్ల నిర్దాక్షిణ్యానికి చాల విచారించి వారి తెలివితేటలు వారి కెటులైన బోధపరుస్తామని స్థిరపరచుకొని నా కెదురుపడిన బాటసారులకు తగిన యేర్పాటు చేసి నేను వెనుకకు తిరిగి యిక్కడకు

వచ్చేను. తరువాయి సంగతి తమరందరకు తెలిసినదే. అయ్యా! గుమాస్తాగారు! అయ్యా! తమరే. పడుచు పడుచువాళ్లు! నా మనవి కొంచం చిత్తగించండి. భగవంతుని దృష్టిలో, అంతా సమానులే. మన మందరం అక్క చెల్లెండ్రు ఆడవాళ్లు కల వారమే. ఈ సత్రవు కట్టించినవాళ్లు ఇది పడుచువాళ్లకు దుక్కల్లాగున్నవాళ్లకు అని యేర్పాటుచేసి కట్టించియుండలేదు. డబ్బున్నవాళ్ళకు, గుమాస్తాల చేతులు తడిచేయువాళ్ళకు—అయ్యా! గుమాస్తాగారూ, తమరు కోపగించుకోనక్కరలేదు—కట్టించలేదు. చిత్తగించేరా? నిన్న నా ముసలాయన ఆ చంటి పిల్ల, తల్లి, ఆముగ్గురు ముగ్గురే. వారిలో నెవర్ని కూడా త్రోసిపుచ్చ వీలులేదుకదా. అలా గనడానికి కూడా నోరు రాదే! అట్టివార్ని చలిలో, రాత్రి కటికచీకటిలో, వర్షము కురియుచుండ, వేరితరాధారము లేని ఈ ప్రదేశంలో తల దాచుకొనుటకు స్థలమైన యివ్వక, పొమ్మనుటకు మీకు నోరేలాగున వచ్చినదయ్యా? అయ్యా! గుమాస్తాగారు. బాటసారులకు వారి కక్కర్తి వారిది. పొమ్మన్నారంటే బాగా నేవుంది. అంతగా దోషములేదు. ఇంగ్లీషు చదువుకున్న ప్రభువులు. కాని, మీకు నోరెటులవచ్చినది? గుండెల్లేవూ? అంతరాత్మలేదూ? మీ యజమానులు మీవంటివారిని జీతమిచ్చి మస్తుగా భోజనముపెట్టి, ఇక్కడ యేర్పరిచిన దెందులకో తెలియదా బాబూ! మిమ్మ నవలసినదేమి? మీవంటి బుద్ధిమంతుల నేర్పాటుచేసిన, దూరదృష్టిచాలని ఆమహానుభా

-చించండి. పిల్లా, జల్లా కలవాడవు. వృద్ధిలోనికి వచ్చు ఏర్పాటులో నుండుము. నీపేరు చెప్పుకొని నీ పిల్లలు, వారి, వారి, జీవితకాలమంతయు, దుఃఖపడునటుల చేయకుము" అని మిగత సత్రవువాసులవైపు తిరిగి సెలవుపుచ్చుకొని తనమిత్రులు—కుర్రవాండ్రకు సగౌరవముగా నమస్కరించి "నా మందలింపులకు నాతోందరకు క్షమించండి" అని చెప్పి నెమ్మదిగా వెలపలకు వచ్చి, సత్రవునవుకరును సత్కరించి, వెడలిపోయెను. యువకులు కొంతవరకు నిశ్చేష్టులై నిలచియుండి చేసినదూరదృష్టి చాలనిపనికి పశ్చాత్తాపపడి త్రోవకు వచ్చి, దీర్ఘమైన యుచ్ఛ్వాసనిశ్వాసలతో, పోయిన వాని వెనుక చూచుచు లోపలకుపోయిరి. ఇతర బాటసారులు కుర్రవాండ్రకు గాకపోయినను, గుమాస్తాకైనను మంచిబుద్ధి రాగలదని సంతసించిరి. ఎన్నిరోజా యుపకారములెత్తిన గుమాస్తా కా యుపదేశ మెంతమాత్రమును పనిచేయదుగాని యధికారులకు తెలిసిన నవుకరీకి ప్రమాదము సంభవించునని మాత్రము జడియకపోలేదు. కాని యెంతమొండివానికి కూడ తాత్కాలికముగానయినను పశ్చాత్తాపము రాదా యని మా భ్రమ—భ్రమయే యేమొ—

మొదటిభాగము—సమాప్తము,



రాజా ప్రెస్, రాజమండ్రి—1930

# రామామృతము

తు 20 లేక అరపౌను — రు 6—0—0.

తు 40 లేక పౌను — రు 10—0—0.

ఇది లోహము, అభ్రకము, సోమియా మొదలగు విలువయైన భస్మములతోను, తదితర వనమూలికలతోను తయారు చేయబడిన లేహ్యము. అనుపానములమార్పులలో దిగువవ్యాధుల కమోఘముగా పనిచేయును.

అజీర్ణములకు, కోరింతదగ్గులకు, కామిర్లకును పెట్టినది పేరు. శుక్ల నష్టములకు, ఆరు నక్షీణములకు, గర్భాశయము లందలి అన్ని బాపతుల జబ్బులకు, ఋతుశూలలకు, కుసుమ రోగములకు దివ్యౌషధము.

బయిష్ట సంబాధమయిన అన్ని జబ్బులకును పనిచేయు ను. గర్భాశయములందలి బాధలు సరిచేసి, సంతానమునకు సావకాశ మొసంగును. ప్రసవించిన స్త్రీలకు శరీరములో రక్త మువృద్ధిచేసి, పిల్లలకు పాలను కలుగచేయును. చిన్నపిల్లలకు వచ్చు ప్రతిరోగము నివారణ చేయును. పని చేయలేదని ఋజువు చేయువారికి డబ్బు తిరిగి యిచ్చివేయబడును. ఒకసారి వాడిచూచిన తెలియగలదు. సలహా ఉచితము.

మరా;—మాదగ్గర, అన్ని ఆయుర్వేద ఔషధములును శాస్త్రప్రకారము తయారయి సిద్ధముగానున్నవి.

జి. వి. రమణారావు,

మోకవీధి, రాజమండ్రి




# ఉచితము!
# క్లీనింగ్!
# ఆయిలింగ్!
# ఉచితము!





మాదగ్గర అన్నిరకముల వాచీలు గడియారములు వగయిరా దొరకును. మాపూచీ (వ్రాతమూలమయిన గ్యారంటీ) మీద యీయబడును.

వాచీలు, గడియారములు, గ్రామఫోన్లు వగయిరా అన్ని బాపతులు మంచి పనిముట్లతో, నమ్మకముగా మరమ్మతు చేయబడును.

ఫోటోగ్రాపులు అన్నిసైజులలోను సరసమైన తగ్గింపు ధరలకు తీసి యీయగలము. బ్రోమైడు ఎన్లార్జిమెంట్లు ఎంత ప్రాతఫోటోనుంచి అయినను సరే, కావలసినంత పెద్దసైజులోనికి, తయారుచేసి యీయబడును. రేట్లు చవుక. ఒకసారి చూచిన తెలియగలదు.

నారాయణరావు బ్రదర్స్,
ఫోటోగ్రాఫర్స్,
శ్రీకృష్ణావాచ్ కంపెనీ
రాజమండ్రి.

# మా ప్రచురణములు—క్రొత్తవి.

## పడకటింటి రహస్యాలు.

| | |
|---|---|
| ముద్దులొలుకు బొమ్మలతో | 0—12—0 |
| భట్టి విక్రమార్కుల కథలు | 0— 8—0 |
| అరేబియన్ నైట్స్ కథలు ఒకటవభా॥ | 0— 8—0 |
| డిటో రెండవ భాగము | 0— 8—0 |
| ఏకాక్షి (పరిశోధక నవల) ఒకటవభాగము | 0— 8—0 |
| ,, రెండవభాగము | 0— 8—0 |
| జోరాజానీ (పరిశోధక నవల) | 0— 4—0 |
| పశ్చాత్తాపము (తమాషాలు) | 0— 4—0 |
| బంగారుయోగము | 0— 4—0 |
| చమత్కారము (సానిపిల్ల) | 0— 4—0 |

అచ్చులో నున్నవి.

| | |
|---|---|
| తంత్రశాస్త్రము (వశీకరణ తంత్రము) | 0— 8—0 |
| మతిమాలిన మరణశాసనము ఒకటవ భాగము | 0— 8—0 |
| ,, రెండవ భాగము | 0— 8—0 |
| ,, మూడవభాగము | 0— 8—0 |
| ప్రేమజాబులు (పద్య సమ్మిళితము) | 0— 8—0 |

నారాయణరావు బ్రదర్స్.
శ్రీకృష్ణాబుక్ డిపో, రాజమండ్రి.

